

# రామకథా రస వాహిని

శ్రీసత్యసాయిబాబా

29

## తెలివితక్కువ అనే ఆరోపము

" ఇంతకాలము అనేక విధముల గౌరవ మర్యాదలను సంపాదించుకొన్న, మీబోటివారే ఆడినమాట తప్పిరన్నచో, ఆ అపకీర్తి మీకేకాని నాకుకాదు. "

పూర్వపు రాజుల వృత్తాంతములు జ్ఞాపకము తెచ్చుకొనుడు! మీ ప్రమాణమును భంగము గావించుకొనకుండ చూచుకొనుడు! రాజా! బాగా ఆలోచించండి. మీరు చాల దుర్మార్గమునకు ఒడిగట్టుకొనుచున్నారు. ధర్మము

తప్పుచున్నారు. పోనీ, మీరంత తెలివితేటలు గలవారే అయియుండిన, నా కోరికలేవియో బాగుగా విచారించి తదుపరి వాగ్దానము చేసియుండవలెను. మీరు కామో ద్రేకులై, కన్ను మిన్ను గానక, ముందు వెనుక చూడక నా మాటలకు కట్టుబడి, వరములిచ్చి యిప్పుడు వాటిని చెల్లించుటలో నాదేతప్పని నన్ను నిందించుటలో మీ రెంత పొరబడు చున్నారో, మీరెంత తెలివితక్కువవారో, యోచించుడు.

ధర్మభీతి, దైవప్రీతిగల నేను ధర్మమును లెక్క చేయక, దారుణ మార్గమున ప్రవేశించినటుల చెప్పితిరి. కానీ, ధర్మవ్రతుడు, దైవసమానుడన్న కీర్తిని ఆర్జించిన మీరు ఆడినమాటతప్పుటలో మీరెంతధర్మవ్రతులో మొదట మీకు మీరు యోచించుకొనుడు.

ఎదుటివారి తప్పులను మాత్రమే వెతుకుటలోనున్న తెలివితేటలు అంత ఉత్తమమైనవికావు. తమలోని తప్పు లనుకూడ తాము వెదికి వాటిని అట్టి పెడమార్గము పట్టనీయక చూచుకొనుటలో తెలివితేటలకు ఘనతచేకూర గలదు. సర్వమెరిగిన ప్రభువులే యిట్టి విచారణ సలుపక తమ స్వార్థమును మాత్రమే తాము చూచుకొన్న మాబోటి అబలలగతి చెప్పనక్కరలేదు. అట్టి మీరేచేయుచుండిన మేము చేసితిమన్న అందులో తప్పేమియుండదు.

వరములిచ్చినది సత్యము, ప్రమాణము చేసినది సత్యము, మాటను తప్పినది సత్యము. ఈ మూడును సత్యములా కాదా? మీరే యోచింపుడు.

పుత్రప్రేమతో, సతీకామముతో, తబ్బిబ్బై మాటను నీటగలిపినది మీరేకాని నేనుగాదు. పుత్రప్రేమ తల్లికి సహజమే. తన కుమారుడు రాజు కావాలని కోరుటలో తల్లిస్థానమందున్న ప్రతిస్త్రీకి సహజమే. అట్టి రాజ్యము స్థిరముగా కాపాడుకొనుటలో అందుకు తగిన ముందు యోచనలు చూచుకొనుటకూడ తల్లి అనువారికి కర్తవ్యమే నేను సహజ కర్తవ్యములనే అనుసరించితిని కానీ విరుద్ధమును చేబట్టలేదు.

రామునకు రాజ్యాభిషేకము చేసిన, అతని తల్లి కౌసల్య రాజమాత కాగలదు. నా కుమారుడు రామాజ్ఞలో చేతులు కట్టుకొని చెప్పిన పనులు చేయుచూ, పనివానివలె నమస్కరించుచుండుట నేను ఒక్క దిన మైనను చూడలేను. చూచి జీవించలేను. అనాడు నా కుమారుని దుస్థితిని జూచి జాలిపడుటకన్నా విషము త్రాగి ప్రాణమును వీడుట మంచిది.

రాజా! నా ప్రాణసమానుడైన భరతునిమీద ఒట్టు పెట్టుకొని చెప్పుచున్నాను. రాముణ్ణి అరణ్యవాసమునకు పంపించడముకన్నా మీరేమి చేసినా నేను తృప్తిపడను.

అని అతి తీక్ష్ణమైన మాటలతో కైకేయి పలికి నేలమీద పడుకొని వెక్కి వెక్కి యేడ్వసాగెను.

అపాయ పరంపరలు

అంత దశరథుడు పిచ్చెత్తిన వానివలె తన తల బాదుకొంటూ, కైకా! ఈ అనర్థము నీకు మేలగునని యెవరైనా బోధించిరా? లేక యేదైనా పిశాచము పట్టి నీ విట్లు పీడింపబడు చున్నావా? రాముణ్ణి అరణ్యము నకు పంపమని భరతునకు పట్టము గట్టమని కోరుటలో యేమిటి ఈ వికారము? ఎందుకీ విపరీత బుద్ధి? కైకా! నీ భర్తనైన నాకునూ, నీ పుత్రుడైన భరతునకును ఈ రాజ్యానికి నీవు మేలు చేయ తలచుకొన్నట్లయితే, ఈ విపరీతపు కోరికలు వీడుము. బాగుగా ఆలోచించు కొనుము. లేకున్న, నీవు నేను, నీ కొమరుడు నిష్కా రణముగా అపకీర్తికిపాలు కావలసి వచ్చును.

అంతటితో పోక, రాజ్యము నాశనము కాగలదు. ఇంకా అనేక ప్రమాదములు సంభవింపవచ్చు. నీచు రాలా! ఈనాడు నీవుకోరినట్లు నేనంగీకరించినను భరతుడు రాజ్యపట్టాభిషేకమునకు ఒప్పుకొనుననుటలో నమ్మకమేమి? భరతుడు ధార్మికుడు. మతిమంతుడు. రాముణ్ణి అడ వుల కంపుటకు కానీ, ఈ రాజ్యమును ఏలుటకు కానీ భరతుడు ఒప్పుకోడు. ఒక్క భరతుడేకాదు మంత్రులు, పురోహితులు మిత్రులు, జనులు, ఋషులు, అందరు

నీ అభీష్టమునకు విరుద్ధులే అగుదురు. ఇందరి అసం తృప్తితో నీవేమి ఆనందించగలవు. చక్కగా యోచించుకో,

పై వారల అంగీకారముతో ఏకాభిప్రాయముంచి. నేటి సాయంకాలము మన జన సభామధ్యమున రామాభిషేకము గావింతునని ప్రకటించితిని. ఈనాడు నా మాటకే నేను అడ్డుతిరిగిన, సేనతో యుద్ధమునకు ప్రవేశించి శత్రుసేనలను చూచి తిరిగి వచ్చినట్లగును కదా!

రామాభిషేకమునకు సకలమూ సంసిద్ధమే. అందరికీ వార్త లందించితిని. ప్రజలు రేపటియేర్పాట్లు తగిన రీతి గావించుచున్నారు. నగరము అప్పుడే జనముచే క్రిక్కిరిసి కళకళలాడు చున్నది.

ఈ సమయములో నేను రాముణ్ణి వనవాసమునకు పంపిన 'రామాభిషేకం, రాజ్యపరిపాలనం, వనవాసం కావటం, ఒక రాత్రిలో జరిగిపోయెనా అని ప్రజలు నన్ను పరిహసించరా? జన సభామధ్యమున ప్రకటించిన పలుకులు నేనిప్పు డేరీతిగా సమర్థించుకొందును? మహారాజు యింత తెలివితక్కువవాడని ప్రజలు యెంత వెక్కరించరు. ఇన్ని సంవత్సరములు ప్రజామన్ననల నందుకొని దశరథ మహారాజు మహాధార్మికుడు, గుణవంతుడు. శౌర్యవంతుడు అను పేరుగాంచి కడకు యింత తెలివి తక్కువగా ప్రవర్తించెనన్న అపకీర్తి నేనెట్లు భరింతును?

అని అనేక విధముల తన గౌరవ మర్యాదలనుకూడనూ విప్పి కైకకు తెలియునట్లు తెలుప ప్రయత్నించెను.

కానీ కైక, మహామారిగా మారి, దశరథుని మాటలను అణుమాత్రమైనను లెక్కచేయక అతని గౌరవ ప్రతిష్ఠలనాలోచించక, తన పట్టును వీడక క్షణక్షణము నకు తన వాంఛను పెంచుకొనుచు పోయెను. మహారాజు మాటలకు విరుద్ధముగా పలుకుచు అతని వాగ్దానమును సారెసారెకూ అతనికి జ్ఞాపకముచేయుచువచ్చెను.

విధవ జీవితము

అంత దశరథుడు, కైకా! రాముడు అరణ్యవాసమునకు పోయినపట్ల నేను క్షణమైనను బ్రతుకను. కౌసల్యా స్థితి చెప్పనక్కరలేదు. ఆ క్షణమే ప్రాణము వీడును. ఇక సీత తల్లడిల్లక మానదు. రాముణ్ణి వీడి క్షణ కాలమైన తాను ఉండలేదు. ఈ ఘోరమును ప్రజలు చూడలేరు. మహా మేధావి, గుణశీలుడైన, రాముని అరణ్యమునకు పంపుచుండ లక్ష్మణుడు ఊరకుండునా? వేయేటికి? మరుక్షణమే లక్ష్మణుడు నీ ప్రాణమును తీయును. ఇది సత్యము, కడకు మన రాజ్యమిన్ని అనర్థములకు, అవస్థలకు గురి కావలసి వచ్చును.

నీకు తెలిసి తెలిసి ఈ ముండ బ్రతుకునకెందులకు యింత ప్రయత్నములు జరుపుకొను చున్నావో,

అర్థమగుట లేదు. దురాత్మురాలా! నీ చక్కదనమును చూచి నేను మోసపోతిని. బంగారుకత్తికదా అని గొంతు కోసుకొనుటకు ప్రయత్నించు మూడుడనైతిని. విషము కలిపిన క్షీరమును త్రాగిన వాడనైతిని. నన్ను అనేక యిచ్చకాలతో మోసము చేసితివి. కడకు నా వంశమునే మట్టిపాలుచేయ సంకల్పించితివి.

ఛీ! నేనెంత మూఢుడను. అనేక యాగములు సల్పి దైవ కటాక్షమున లభించిన పవిత్రపుత్రుని అమ్ముకొని స్త్రీ సుఖమును కొనుక్కొనే పాపినా నేను. ఇట్టిది దశరథ మహారాజు చేయ తగినదా? ఇట్టిదానికి నే ఒడిగట్టిన, కుక్కలు కూడనూ నన్ను నిందించును కదా? ప్రతి బాలుడు కూడను నన్నుచూచి రాలు రువ్వకుందురా? కడకు యిట్టి గతియా దశరథునకు? ఛీ! యిది నాపురాకృత దుష్కృతము. మెడకు వేసికొన్నది ఉరిత్రాడని తెలియక భద్రపరచి నట్లయినది. ఇంతకాలము రమించినది మృత్యుదేవత నను విషయము నాకు తెలియక పోయెను చేతులారా మృత్యువును రమించితిని. వర్ధించితిని. అదినా పాప ఫలము. కాకున్న స్త్రీ సుఖమునకై కన్నకొడుకును కారడవుల కంపునట్టి తల్లిదండ్రులుందురా? అయ్యో! ఏమిటి ఈ విచిత్రము! ఇప్పటికి కూడను నేను నమ్మలేకున్నాను.

కైకా! మార్చుకొమ్ము. నీ మూఢతలంపు. రాముడు

నా మాటకు మారు మాటాడడు. అసలు ఈ విషయ మును వినిననూ చాలు. చెప్పనక్కర లేదు. అడవికి వెళ్ళుటకు సంసిద్ధుడు కాగలడు. నన్నెందులకు అడ వికి పంపుచున్నావని కూడను ప్రశ్నించడు. అట్టి గుణ శీలుడు రాముడు. రాముడేమిటి నా కుమారులెవ్వరును నా ఆజ్ఞను మీరరు. భరతుడు నీయీ తలంపును వినిన సహించడు. తల్లి అని కూడను విచారించక యేమైనను చేయవచ్చు. భరతునకు రాములన్న పంచప్రాణము. నీ కోరికకు విరుద్ధముగా నైనను చేయ సంసిద్ధుడు అనగా భరతుడే అడవికి వెళ్ళి రామునకు పట్టాభిషేకము చేయ వచ్చు. అట్టి గుణశాలి భరతుడు. వాని మనసును కూడను గమనించలేని నీ దుర్బుద్ధి నేమని చింతింతును.

కైకా! వినాశకాలే విపరీత బుద్ధి అన్నట్లు నీ వినా శమునకే ఈ వికార తలంపులు కలుగుచున్నవి.

ఈ యిక్ష్వాకుల వంశమునకే తీరని అపకీర్తిని తే గోరుచున్నావు. ఇందరిని తీరని దుఃఖములోముంచి ప్రాణ ములు తీసిన నీవు మాత్రము ఏమి ఆనందము ననుభ వింతువు. ఒకవేళ ఆనందించినను అది ఆనందమా?

ఛీ! ఛీ! పరుల బాధనుచూచి, ఆనందించువారు మహా పాపులు. రాక్షసులు. పరుల సంతోషమును కోరువారు పరుల ఆనందము నపేక్షించువారు పవిత్రులు.

మహారాణివై, రాజపుత్రివై యింత మాత్రమయినను తెలిసికొనలేకుండిన రాజవంశములకే అపకీర్తి కదా! కైకా! నేను కడసారిగా ఒక్క మాటను చెప్పతలంచుచున్నాను. విను, రాముడు నాప్రాణము. వానిని వీడి నేను బ్రతుక లేను. నీ కసంతృప్తి పెట్టలేను. ఒక వేళ నీ తృప్తి నిమిత్తమై నేను రాముణ్ణి అరణ్యమునకు వెళ్ళమని నోటితో తెలుపకున్నను ఈ విషయమును విన్న రాముడు పితృ వాక్య పరిపాలకుడు గనుక తండ్రిమాటను నెరవేర్చు టకై తనకుతానే అరణ్యమునకు బయలుదేరి పోవును. దానికి అడ్డుండదు.

ఆ వార్త విన్న క్షణమునందే నేను ప్రాణమును విడుతును. లక్ష్మణుడు, సీత, కౌసల్య రామునితో అడవులకు వెళ్ళవచ్చును. కారణమేమన కౌసల్య రాముని విడిచి బ్రతుకదు. సీత రాముని అనుసరించక మానదు. లక్ష్మణుడు రాముని అడుగుజాడలను వీడడు. లక్ష్మ ణుని అనుసరించి ఊర్మిళకూడ వెళ్ళవచ్చును. అట్టి సమయమున నేను ప్రాణములను వీడిన ఈకాయము నకు అంత్యక్రియలు సలుపు వారుండరు

అంత్యక్రియలకు అడ్డు

ఈవార్త కేకయరాజునకు తెలిపి, భరత శత్రు ఘ్నులను గొనివచ్చుటకు కాలము పట్టును. అంతవరకూ దీని కెవ్వరూ సంస్కారము చేయరు. ఒకవేళ నేనిట్టి

కిరాతకపు చేష్టలకు ఒడిగట్టితినని, నన్ను ప్రజలుకూడ చూడక, కాకుల గద్దల పాల్గావించవచ్చును. అయితే నా ప్రజలు అట్టి స్థితికి పూనుకొనరు. కనుక భరతుడు వచ్చు వరకు యేదో ఒక విధముగ ఈ కాయమును పెట్టియుంచుదురు. కానీ రాజ్యపాలనకే భరతుడు ఒప్పుకొనుపట్ల అట్టివాడు నా కాయమును ముట్టుటకు కాని, దహన సంస్కారములు చేయుటకు కాని వీలుండదు. అట్టివాడు అర్హుడుకూడ కాడు గనుక వానిచేత నీ ప్రేత కర్మను చేయించనని వాగ్దానమైననూ చేయుము అని అడిగెను.

ఇట్లు నీవు వాగ్దానమిచ్చినను ఇవ్వవచ్చును. కానీ ముండగా బ్రతికి జీవించుటలో నీకేమి ఆనందముండునో తెలుపుము. దుష్టచారిణీ! కడకు యింత కిరాతకురాల వైతివా? రఘువంశమునే నేల రాల్చుచున్నావా? ఇది నీ స్వభావమా? లేక వైష్ణవమాయ నీలో ప్రవేశించి నిన్ని ట్లాడించుచున్నదా? అర్థము కాకున్నది. అని దశరథుడు బాధపడుచుండగా మూడు ఝాములు గడచినవి. వ్యాధి గ్రస్తునివలె, నిట్టూర్పులు విడుస్తూ కుమిలిపోవుచున్నాడు దశరథుడు.

( సశేషము )

## "శిక్షణరంగమందు
## ధర్మసంస్థాపన"

1972 మే నెల 31 రోజులు ప్రశాంత గంభీర సుందర వసంత వాతావరణములో. మేఘాలయ నుండి కేరళవరకూ డార్జిలింగునుండి మధురవరకూ, దేశములోని వివిధ రాజకీయ భాషాప్రయుక్త ప్రాంతములనుండి వచ్చిన మూడు వందలమంది కళాశాల విద్యార్థులు బృందావనములో సమావేశమై, భగవాన్ బాబావారి అపారప్రేమవాహినిలో పునీతులై, ఆధునిక సారస్వత, వైజ్ఞానిక, ఆధ్యాత్మిక, కళారంగాలలో విఖ్యాతులైన వారితో సన్నిహిత సంబంధము గలవారలై, మన భారతదేశపు వివిధ దృక్పధ విజ్ఞాన సమన్విత సనాతన సంస్కృతికి నిజమైన వారసులుగా పరివర్తనచెందిరి.

ఈ క్యాంపులో పాల్గొన్న ప్రతివారు ఆధునిక విద్యా పునర్వ్యవస్థీకరణోద్యమ చరిత్రలో "అనన్యసామాన్యమైన మహోద్యమం"గా యీ క్యాంపును ప్రస్తుతించారు.

మే నెల 31 వ తేదీన డా॥గోకాక్‌గారు ఆ మహోజ్వలో ద్ధుణాద్భుత విద్యుత్‌గమన వాతావరణమునకు "భగవానులే కర్త, సంరక్షకుడు, సూత్రధారి, ప్రిబోధకుడు, ప్రేక్షకుడు" అంటూ "నేటి కళాశాల విద్యలో మూడు రకములైన పొరపాట్లను ఈ

ప్రణాళికద్వారా సరిదిద్దుటకు ప్రయత్నించినాము అన్నారు. 1) మన జన్మ హక్కైన జాతీయ సంస్కృతితో సన్నిహిత సంబంధము 2) ప్రపంచ రాజ్యాల ప్రజల ఆధ్యాత్మిక అభిమతాన్ని అర్థము చేసికోవటము 3) బహుముఖవిజ్ఞానదాయకమైన హిందూ సంస్కృతి ( యోగాసనములు. హిందూ మత శాస్త్రగ్రంథములు. ఆధ్యాత్మికతత్త్వమార్గములు, భౌతికశాస్త్రము, వాటియొక్క తారతమ్యత ) వీటినన్నింటిని దృష్టియందుంచుకొని వారమునకు 6 రోజులు, రోజుకు అయిదు ఉపన్యాసములుచొప్పున, వాటియొక్క తారతమ్యము. వాటిలోని తత్త్వసారముతోకూడిన భగవాన్ ప్రబోధములు. జరుగుచుండెడివి.

ఈ క్యాంపులోపాల్గొను విద్యార్థులు బ్రాహ్మీముహూర్తమున తెల్లవారు ఝామున గం॥ 4-30 లకు ప్రణవోచ్చారణతో ప్రారంభించి బస్సులలో బృందావనమునకు సమీపముననున్న గ్రామములకు వెళ్ళి వీధులలో పాదచారులై భగవాన్ అత్యంత విలువనిచ్చు సంకీర్తన. సేవాకార్యములలో పాల్గొనెడి వారు

ప్రాతఃకాల ఉపాహారము తరువాత మూడు ఉపన్యాసములకు హాజరవటము. మధ్యాహ్నము ఒంటి గంటకు భోజనము కొంత విశ్రాంతి. తరువాత సాయంకాలము మూడు గంటలకు మరల రెండుఉపన్యాసములకు సిద్ధమయ్యేడివారు. సాయంకాలము అయిదుగంటలకు 'టీ'తీసికొన్న తరువాత 5-45నుండి 6-30వరకు భజన. ఆ తరువాత రాష్ట్రివారీగా ఎన్నిక చేయబడినవారిచే ఆ రోజున జరిగిన ఉపన్యాసములు సంగ్రహముగా చెప్పబడెడివి.

తరువాత భగవాన్ ఆశీర్వాదములు ప్రసాదించి, ఆధ్యాత్మిక జీవితాచరణలో ఎదురయ్యే అనేక చిక్కు సమస్యలకు పరిష్కారమార్గమును సూచిస్తూ, యువతీయువకులను పవిత్రమైన, ఉపయోగకరమైన, అత్యంత విలువైన జీవితమునకు ప్రోత్సహించెడివారు.

ఈ సాయీయుగములో మనదేశములోని కళాశాలలనుండి ఆత్మవిద్యామార్గదర్శకులుగా ఎన్నికకాబడి, ఈ ఆధ్యాత్మిక మహాసభలకు పాల్గొనే అదృష్టము ఏబదిమంది ఉపాధ్యాయులకు, 100 మంది ఆడపిల్లలకు, 200మందిమగపిల్లలకు, మాత్రము కలిగినది.

ఆ దివ్య ప్రేమానుబంధ వాతావరణములో మనఃపూర్వక పరిశీలనాత్మక సంయమముతో, పరస్పర సేవాభిలాషతో శోభిల్లు ఆ విద్యార్థిలోకం ఉపాధ్యాయులకు ఒక వింత అనుభవమును కలుగచేసినది. తమ యెదుటనున్న మూడు వందలమంది విద్యార్థులు దేశములో విభిన్న ప్రాంతములకుచెందిన ఇస్లాం, క్రీస్టియన్, జొరాష్ట్రియన్, జైన్, సిఖ్ మొదలైనవివిధమతములకు చెందినవారయినప్పటికి శ్రీవారి అధ్వర్యములో సమావేశమై వినయవిధేయతలతో ఎంతో క్రమశిక్షణతో ప్రవర్తించటము చాల ముదావహము. శిక్షణపద్ధతుల ననుసరించి శ్రీవారి దివ్య బోధనలను చిత్రముల ద్వారా అందరికి సులభముగా అందజేయుకొరకు బొంబాయి సమితి వారు ఒక ఎగ్జిబిషన్‌ను బృందావనములో ఏర్పాటుచేసిరి క్యాంపులోని విద్యార్థి విద్యార్థినులకు ఆధ్యాత్మిక విషయములకు సంబంధించిన ఫిల్ములనుకూడ వారు ప్రదర్శించిరి.

ఆదివారములలో తెల్లవారుఝామున ప్రణవోపాసన, తరు

వాత నగరసంకీర్తన, తరువాత యోగాసనములు భగవాన్ బాబావారి దివ్య బోధ అటుపై ఆధ్యాత్మిక మార్గానువర్తులైన జిజ్ఞాసుల ప్రశ్నలకు భగవాన్ ప్రేమపూర్వక సమాధానములు. ఆ తరువాత యేదియోయొక దరమైన సేవాకార్య క్రమములో ఆడపిల్లలు, మొగపిల్లలు అమితోత్సాహముతో మధ్యాహ్న భోజనవేళవరకు పాల్గొనెడివారు.

ఈ క్యాంపులో పాల్గొనినవిద్యార్థులకు పలురీతుల బోధించిన వారు. డా॥ శ్రీ మోహన్‌లాల్‌సుఖాడియా (బెంగుళూరు.మైసూరు. కర్ణాటక విశ్వవిద్యాలయాధ్యక్షులు) ఆర్.ఆర్. దివాకర్ (పాట్నా విశ్వవిద్యాలయాధ్యక్షులు) డా॥ భగవంతం (ఉస్మానియా విశ్వవిద్యాలయ పూర్వోపాధ్యక్షులు) డా॥ గోకాక్ (బెంగుళూరు విశ్వవిద్యాలయ పూర్వోపాధ్యక్షులు) శ్రీ టుకోల్ (బెంగళూరు. విశ్వవిద్యాలయాధ్యక్షులు) జనరల్ సి. ఎం. కారియప్ప, మైసూరు హైకోర్టు జడ్జి శ్రీ గోపీవల్లభయ్యంగారు. ప్రొఫెసర్ యన్. ఎ. విక్రం (మైసూరు విశ్వవిద్యాలయ పూర్వోపాధ్యక్షులు) శ్రీ నకుల్‌సేన్ ఐ.సి.యస్. (గోవాగవర్నరు.) శ్రీమతిరుక్మిణీఅరుండేల్. డా॥టి. యమ్.పి. మహదేవన్(వేదాంతాధ్యయనసంస్థ డైరెక్టరు మద్రాసు) నవానగర్ రాజమాతగారు, శ్రీ కె.గురుదత్ ఐ.ఎ.యస్. డా॥వర్మ (బెంగుళూరు) ఆర్షవిద్యాపారంగతులైన డా॥దివాకర్ల వెంకటావధాని (హైదరాబాదు) జమ్మలమడక మాధవరామశర్మ (గుంటూరు); బ్రహ్మశ్రీ కొల్లూరుసోమశేఖరశాస్త్రి, పిడపర్తికృష్ణమూర్తిశాస్త్రి, శిష్టా చంద్రమౌళిశాస్త్రి; ప్రొ॥ జి.పి. రాజరత్నం (బెంగుళూరు) ప్రొ॥

పాండురంగి (బెంగుళూరు); ప్రొ॥ మాగిల్ (ఢిల్లీ) డా॥ఎ కె.శరన్ (సిమ్లా) డా॥ చంద్రశేఖర్ఠాకూర్ (జాంనగర్); డా॥సుందరమ్ ( మద్రాసు ) డా॥ చతుర్వేదుల నరసింహశాస్త్రి (గుంటూరు) లేండన్ కార్టర్ (కొలొరాడో); ప్రొ॥ భండార్కార్ (గ్వాలియర్) డా॥ డి.ఆర్. బేంద్రే (కర్నాటక విద్వత్కవి); బ్రహ్మశ్రీ దేవ రాతశర్మ (ప్రఖ్యాత వేదవిద్వాంసులు, కవి) ; యోగాసనశిక్షకులు నాగేశ్వరరావు (కైవల్యధామ్ బొంబాయి); శ్రీమతి ఇంద్రాదేవి (మెక్సికో); ప్రిన్సిపాల్ ఎచ్. సుందరరావు, విద్వాన్ తిరుమలా చార్య, వెంకటగిరి. శ్రీ శ్రీరామమూర్తి ఎం యస్.పి, ఆకివీడు.

గవాయిశ్రీ చతుర్భుజ్ రాతోడ్ (బొంబాయి) భజనలో పాల్గొన్నవారికి సంకీర్తనలను గురించి ప్రబోధించిరి.

ఈ సమావేశము యువహృదయములపై ఎంత బల మైనముద్రలను వేసినదో సమావేశాంత్యదినమందు చేసిన ఈక్రింది నలుగురి మనఃపూర్వకసంభాషణములవలన మనము తెలిసికోవచ్చును.

మీరాభరాని (ఢిల్లీ) " ఈ సమావేశము నాకు మొదటనే ఎంతో అద్భుతముగా తోచెను. ఈ ఇరువదవ శతాబ్దములో రాకె ట్లనుగురించి, చంద్రలోక యాత్రలగురించి, కంప్యూటర్లనుగురించి మరింత వేగముగాపోరుగెత్తేవాహనములగురించి అందరు ఆలోచించే టపుడు మేము మాత్రమిక్కడ భారతీయ సంస్కృతిని గురించి. పరస్పరావగాహన గురించి, ఆత్మతత్త్వాన్ని గురించి మాట్లాడు కోవటము నాకెంతో గొప్ప అనిపించినది. ఈ క్యాంపు మాకొక గొప్ప మేల్కొలుపు. మేము ప్రపంచపు వాస్తవిక పరిస్థితు

లను గ్రహించి మా సందేహములకు సమాధానములు పొంద గలిగినాము. అణువుకు బ్రహ్మాండమునకు, మంచుగడ్డకు నీటికి వలెనే విభేదములేదని గ్రహించ గలిగినాము.

ఈ వేసవిక్యాంపులద్వారా భగవాన్ అనుగ్రహించినవెలుగు వలన మాలోని చీకట్లు తొలగిపోయినవి. వాస్తవమైన సనాతన సంప్రదాయపు విలువలను గ్రహించగలిగినాము.

ఆత్మహత్యాసదృశ్యమైన ఈనాటి పరిస్థితులను భగవాన్‌వారి అపార దివ్య ప్రేమామృత చైతన్యశక్తితో పునరుజ్జీవింపచేయుటకే ఈ వేసవి క్యాంపు యేర్పాటు కావించిరి.

మేము ఇంతవరకు జర్మన్‌వారి వాషింగ్‌మెషిన్‌గొప్పదో ఫ్రెంచివారి వాషింగ్‌మెషిన్ గొప్పదో, మన వ్యాక్యూమ్ క్లీనర్ గొప్పదో, మన పొరుగువారిది గొప్పదో తెలిసికొనుటకు మాబుద్ధి నుపయోగించాముకాని, మృగముకంటె మనిషి ఎంతగొప్పవాడో ఆలోచించలేదు మానవజన్మము మరీమరీ కావాలని యెందువలన ఆశించబడుతోందో అర్థము చేసికొనుటకు యింతవరకుయెన్నడు మేము ప్రయత్నించలేమ, జీవితమునే ఒక పాఠశాలగా ప్రకృతినే బోధకునిగా మానవసేవయే ధ్యేయముగా యిక పరివర్తించు కొనవలసియున్నది.''

ఢిల్లీ విద్యార్థిని ఓనితాబాల్ యిట్లా అన్నది. ''మేము ఒక నెలక్రితం బృందావనమువచ్చి భగవాన్‌తో కలిసిమెలసి జీవించాము. వారు యిచ్చిన ఆహారము తీసుకొంటూ వారి ఆశ్రియ ములో విశ్రమించాము. ఈ కాలపు యువకతరానికి మేమొక

ఉపమానసదృశము. ఆధ్యాత్మిక జీవితమునుగురించి యింత వరకు మాకు అణుమాత్రమైనా తెలియదు. మనము పీల్చే ప్రతి శ్వాస పరమాత్మునిదే అని తెలిసికొనినపుడే మనలో నిజమయిన ఆధ్యాత్మిక జీవితము ప్రారంభమవుతుంది.

భగవదాయత్తంగాని చిత్తంతో కోర్కెలతో ఆరంభ మయిన జీవితము కేవలము అదృష్టముపై ఆధారపడి అటుఇటు త్రాడు తెగిన గాలి పటములా అవుతుందని యిప్పుడు తెలిసికొన్నాము. ఈ వేసవిక్యాంపులు మన హృదయములలో భగవంతుని సుస్థిరముగా ప్రతిష్ఠించినవి.

ఈ నెలరోజులు మాప్రతిఒక్కరికీ ప్రేమ, త్యాగము, సేవ నిత్యకార్యక్రమములై పోయినవి. ఉదయమునుండి సాయంకాలమువరకు వ్యాసంగము; తీరికవేళలలో కుర్చీలదుమ్ము దులపడము, వరండాలు చీపురులతో ఊడ్చటము వాడిపోయే మొక్కలకు నీరు పోయటము ఇట్లు గడచినవి. భజనలో తాళం నుండి తోటలోకసు వూడ్చే పనివరకు భగవాన్ ప్రేమపూర్వకమైన పర్యవేక్షణలో సాగినవి. అదే మా జీవితమునకు ఒక క్రొత్తవెలుగును ప్రసాదించినది.

ఈ వేసవి క్యాంపుల ఉద్దేశము ఏవోకొన్ని వివరములను తెలియజేయటం మాత్రమేకాదు. ముఖ్యంగా మా జీవితములకు క్రొత్త పరివర్తనము కలుగజేయుటకని మా అభిప్రాయం. ప్రొపెసర్లు మనఃపూర్వకంగా సంపూర్ణ సమర్పణ బుద్ధితో ప్రార్థనా పూర్వకమైన ఆవేశముతో మాకు ఈ నవీన గురుకుల అనుభవ

ములను ప్రసాదించి మాలో అచంచలమయిన వినయ విధేయ తలను పాదుగొల్పిరి.''

మహారాష్ట్రనుండి వచ్చినవిద్యార్థి కమల్‌సహాని మాట్లాడుతూ ''దిక్కులుపరిభ్రమించే పవిత్రప్రణవనాదముతో మేల్కొని పల్లెటూరి ప్రశాంతోదయ వాతావరణములో భగవానుని మధుర నామమును పాడుకొనే అద్భుతానందమును మే మెన్నడు యింతకుముందు అనుభవించలేదు.

బృందావన పరిసర గ్రామ వీధులలో భగవానుని పవిత్ర నామము గానముచేస్తు మేము అనుభవించిన సంతృప్తి ప్రతి వారిలోను ప్రతిబింబించుటను మేము చూచితిమి.

మేము బృందావనముచేరిన తక్షణమే భగవాన్ మాకు దివ్యదర్శనమిచ్చి ఆశీర్వాదములు ప్రసాదించిరి.

రోజంతయు ఎడతెరిపిలేని కార్యక్రమములలో పాల్గొన్న మాకు సాయంకాలపు భజనలు ఆనందప్రదమైన విశ్రాంతిని కలిగిస్తూ, రేపటి నగర సంకీర్తనమునకు ఒకవిధమైన లయబద్ధ సంగీత సాధనగాకూడ మాకు ఉపయుక్తమయ్యేడివి. భజనలో భగవాన్ మాతో పాల్గొనుట వలన మా ఆనందమునకు అవధు లుండెడివి కావు.

మా ఆధ్యాత్మికవిద్యా సముపార్జనలో ఆచరణ ఎంత మాత్రము నిర్లక్ష్యము చేయబడలేదు. పట్టణవాస నవనాగరికతా జీవన విధానానికి అలవాటుపడిన మా శరీరకండరములు, ధ్యానము

యోగము నేర్చుకొనుటలో వెలిబుచ్చు సాధనా విధానములు. ఇతరులకు ఎంతో హాస్యాస్పదముగా కనబడెడివి

భగవాన్ పర్యవేక్షణలో ఆదివారములందు తోటపని మొద లగు కర్మలు అనుష్ఠించబడెడివి. నిజమైన ఆత్మతృప్తి, ఆత్మ దర్శనము ఒక్క సాంఘిక సేవలోనే పొందగలమని మేమందరము తెలిసికొన్నాము. ఈ విధమైన ఏకత్వానుభూతిని మా నిత్య జీవితములోకూడ అనువర్తించుకోవలెనని ఆశించుచున్నాము. ఇనుమును బంగారముగా మార్చివేయగల భగవాన్ తమ యొక్క సాన్నిధ్యము వలనను, దైవిక ప్రబోధమువలనను, మంచిగా ఉండుము. మంచిని చేయుము. మంచిని చూడుము అనే ప్రధా నమైన మనస్తత్త్వముగలవారిగా మమ్ములను మార్చివేసినారు.

మా హృదయంలో భగవానునియెడ మాకు కలిగిన భక్తి ప్రేమలతో కూడిన మానసికోద్వేగాలను తెలియజెప్పుటమునకు ఆంగ్లభాషలో సరియైన పదజాలము లేదని నేను మొదటిసారిగా యిప్పుడే గ్రహించ కలిగినాను.

ఢిల్లీలోని విద్యార్థియైన దీపక్‌నందా యిట్లా అన్నాడు. "భగవాన్! ప్రేమమూర్తీ! ఈ ఆత్మవిద్యా విజ్ఞాన విశేష మును అనన్యమైన ప్రేమతో, మీరున్నూ, మీ సమక్షములో యీ ఆధ్యాత్మికబృందమున్నూ, మా హస్తగతముచేసారు. ఈ అమూల్య విజ్ఞాన సంపద మానిత్యజీవితములో లోడ్పడునట్లుదీవించుడని మా విద్యార్థిలోకం అందరితరపున మిమ్ములను పదేపదే ప్రార్థించు చున్నాను.

ఈ ఆధ్యాత్మిక శిక్షణాక్రమము, భారతదేశమందలి అన్ని కాలేజీలకు "సాయీయుగ ప్రభాతోదయ కాంతులను ప్రసరింప చేయుచున్నదని భావించుచున్నను

ఈ క్యాంపులో పాల్గొన్నవారిలో పోస్టుగ్రాడ్యుయేట్లనుండి పి.యు.సి. మొదటి సంవత్సరము విద్యార్థులవరకు నున్నారు. వారు అయిదు వర్గములుగా విభజింపబడిరి.

మేనెల 30 వ తేదీన— (1) సంస్కృతి, యోగశాస్త్రము (2) వైజ్ఞానిక, సాంఘికశాస్త్ర విలువలు (3) హిందూమతగ్రంథ ములు (4) దర్శనములు (5) పురాణములు, ధర్మశాస్త్రములు వాటియొక్క తారతమ్యత: వీటిని గురించి ఐదు విధములయిన విశాల దృక్పథముగల ప్రశ్నావలి కూర్చబడి, విద్యార్థులనుండి వారి యిష్టమువచ్చిన ప్రశ్నలకు ఎంతో సంతృప్తికరమైన సమా ధానములు విశదీకరింపబడినవి. విద్యార్థులు అన్ని ఉపన్యాసము లను చక్కగా జీర్ణింపజేసికొని ఈ ఉద్యమమును విజయవం తము చేసిరనుటకు ఎంతమాత్రము సందేహములేదు.

వర్గమునకు రెండు బహుమతులవంతున పది బహుమతు లను భగవాన్ కరుణాపూరిత హస్తాబ్జములతో మేనెల 31 వ తేదీన ప్రసాదించిరి.

పాఠకులు ఆ ప్రశ్నావళిలోని విశిష్టతను గ్రహించగలం దులకై మచ్చుకు కొన్ని మాత్రము:

మానవ శరీరములోని యోగచక్రములెన్ని? అహింస

యెడల గాంధీజీ అభిప్రాయమేమైయుండును? జవహర్‌లాల్ ఏయే ప్రాముఖుల పలుకుబడికి లోనయ్యారు? ఆ పలుకుబడి నెహ్రూజీలో ఎటువంటి పరివర్తన కలుగజేసినది? తప్పనిసరైన ఈ యాంత్రిక యుగములో బ్రతుకుటకు అర్హులము కావలెనన్న మనల్ని మనము ఎట్లా మలచుకోవలెను? విచక్షణారహితమైన రీతిలో మానవుడు ప్రకృతిపై ప్రభుత్వము నెలకొల్పుటకు ప్రయత్నించుచున్నాడనే దానికి కొక ఉపమానము చెపుతూ, దానిఫలితము మానవునిపైనెటువంటి పరిణామము కలుగజేయునో తెల్పుము? నచికేతునికి యమునకు మధ్య జరిగిన కథయొక్క ప్రాముఖ్యతయెట్టిది? గాయత్రీమంత్రము అంటే యేమిటి? దాని ప్రాముఖ్యతను సంగ్రహముగా వివరింపుడు? శ్రీరాముని "విగ్రహవాన్ ధర్మః" అని ఎందువలన చెప్పవలసి వచ్చినది? భాగవతములోని గజేంద్రమోక్షము యొక్కయూ, అంబరీషోపాఖ్యానము యొక్కయూ, ధ్రువోపాఖ్యానము యొక్కయూ భావార్థములెట్టివి? హిందూమతములోని త్రిమూర్తి స్వరూపముల భావమెట్టిది? యజ్ఞముయొక్క ఆవశ్యకత దాని నిజ స్వరూపము వీటిని వివరింపుడు?

"యోగః చిత్తవృత్తి నిరోధః" అన్న సూత్రమును వివరింపుడు? "అవతారము" అన్న పదాన్ని ఎట్లు వ్యాఖ్యానింతురు? శివరాత్రియొక్క ప్రాముఖ్యత యెట్టిది? ఆధ్యాత్మిక జీవితానికి భగవాన్ శ్రీసత్యసాయిబాబావారి చతుస్సూత్రపదాన్ని వివరింపుడు? రసానుభూతివలన కలిగే పరిణామ మెట్టిది? నామ సంకీర్తనము వలన కలిగెడి ఫలితములను విశదీకరింపుడు? బుద్ధుడు ప్రకటించిన నాలుగు ప్రఖ్యాత సత్యము లెట్టివి?

" ప్రపంచానికంతకు ఒకేమతము సాధ్యమేనా? ఎందుచేత? లక్ష్యము, సాధనోపకరణములను గురించి విశదీకరింపుడు. 'ఏ శక్తి ప్రేరణమువలన మనము ఇటుగా నుంటున్నాము! "గుణాతీతునియొక్కయు, స్థితప్రజ్ఞునియొక్కయు, యోగియొక్కయు, బ్రహ్మజ్ఞానియొక్కయు, ఆదర్శ లక్ష్యములను వర్ణించి చెప్పుము? ముఖ్యమైన సాంఘిక న్యాయమేమిటి? సాయీయుగముయొక్క అంతరార్థమేమిటి? "

ఈ వేసవి క్యాంపులో పాల్గొన్న పండితుల ఉపన్యాసములు భగవాన్ ప్రబోధములు, అవి సదస్యులపై కలిగించిన ప్రభావమును గురించిన సమీక్షతోకూడిన పుస్తకము త్వరలో పాఠకుల హస్తముల నలంకరించబోవుచున్నది.

ఈశకపు విద్యావిషయమున ప్రాముఖ్యతనొందిన కొఠారికమీషన్ రిపోర్టుయొక్క రచయితయైన డా॥డి.యస్.కొఠారి (యూనివర్శిటీగ్రాంటుకమీషన్ అధ్యక్షుడు) 31వతేదీక్యాంపుయొక్క సమాప్తి సమావేశమందు అధ్యక్షపీఠమునుండి : "ప్రత్యక్షముగాజరిగిన ఈ ఉపన్యాసములు, ఈ అధ్యయనములు, ఈ ప్రబోధములు, ఈ సాంఘిక సేవాకార్యక్రమములు, ఈ బృందావనములో భౌతికమైన, ఆధ్యాత్మికమైన ఒక విచిత్ర వాతావరణాన్ని సృష్టించి అందరి హృదయములలోను నూతన విలువలను సృష్టించినవి. " అనిరి.

ఆ రోజుననే మైసూరు విద్యామంత్రి శ్రీ బదరీనారాయణ్ గారు "ఈ భగవదవతారం మనందరి మధ్యయుండి మనకు

దర్శన, స్పర్శన సంభాషణ భాగ్యమును కలుగజేయుచున్నందుకు మనము యెంతగానో కృతజ్ఞులమై యుండవలెను

కృపాపూరితమైన వారి పర్యవేక్షణలో, ఆధ్యాత్మికవాతావరణముతో నిండియున్న ఈ పవిత్ర శాంత సుందర స్థలములో విద్యార్థులు పూర్తిగా ఒక నెల గడపటము ఏంతో అదృష్టపూర్వ సంఘటన.

పశ్చిమ రాజ్యాలవారు వారి జీవితములకు శాంతిమయ సమాధానముకొరకు మనదేశములో పాఠములు నేర్చుకొంటుంటే మన దేశస్థులు మన వారసత్వపు హక్కైన మన సాంప్రదాయక జ్ఞాన సంస్కృతిని విడిచిపెట్టి ఆ పశ్చిమదేశాల దోషభూయిష్ట నాగరికతను అనుసరించుటకు ప్రయత్నిస్తున్నారు. ఇది యెంత దురదృష్టము! దౌర్భాగ్యకరమైన ఈ ఆధ్యాత్మిక అధోగతినుండి భగవాన్ ఈ ప్రపంచమును లేవనెత్తి కాపాడుచున్నారు'' అని అన్నారు.

30 వ తేదీన మైసూరు గవర్నరు శ్రీ మోహన్‌లాల్ సుఖాడియా ఉపన్యసిస్తూ, ''మన కాలేజీ విద్యార్థులకు వారు యెంతో తెలివైనవారయినప్పటికీ, ఆడపిల్లలకుకాని, మొగపిల్లలకుకాని మన పురాణములను గురించిగాని, మతగ్రంథములనుగురించిగాని చరిత్రలోని సత్యాన్నిగురించిగాని, శక్తినిగురించిగాని లేశమాత్రమైనను తెలియదు. వారు సంపాదించిన విద్యా వైఖరులే వారిని వారి యొక్క శేషజీవితములో సుఖశాంతులకు దూరంజేస్తున్నాయి. భగవాన్ యిక్కడ ఏర్పాటుజేసినట్టి ఈ ఆధ్యాత్మిక క్యాంపు

కంటెను ఉపయోగకరమైనట్టియూ, జ్ఞానదాయకమైనట్టియూ మరే ఉద్యమాన్ని కూడను నేను ఊహించలేను.

నిజానికి డా॥ గోకాక్ చెప్పినట్లు, ఈ క్యాంపులో పాల్గొనిన యేయొక్కరూ యిక వెనుకటి మామూలు జీవితం జీవించలేరు. ప్రతి క్షణము శ్రీవారు కృపతో విద్యార్థులతో కలిసి యుంటూ వారి మంచిచెడ్డలను పరిశీలిస్తూ, ప్రబోధిస్తూ, హెచ్చరిస్తూ, ఉత్సాహపరచుచూ విపులీకరిస్తూ ఎంతో ప్రేమతో వారికిమాయ కర్మ, ఆత్మ పరమాత్మ, శ్రద్ధ, భక్తి, ధర్మములనుగురించి వివరిస్తూ యుండేవారు. దివ్యప్రేమను పెంపొందించుకొనుటకు ప్రోత్సహిస్తూ ఈ సమస్త సృష్టిలోని భిన్నత్వంలోను ఏకత్వాన్నిదర్శించుటకు వలయు సాధనాశక్తిని ప్రసాదించెడివారు.

ఉపన్యాసకులందరికంటె కూడ శ్రీభగవాన్ ఎంతోకరుణతో ముప్పదిఎనిమిది ప్రబోధములను ప్రసాదించిరి.

ప్రతి ఆదివారము, ఆత్మయొక్కస్థావమెక్కడ? మాయను యే విధముగా జయించగలము? ఏకాగ్రతను ఎట్లా సాధించగలము? సేవాకార్యక్రమములు మనలను మరింత కర్మపాశబద్ధులను చేయునా? చావు తర్వాత ఏమి జరుగుతుంది? సాక్షాత్కారమునకు ప్రాణాయామము యెంతవరకు ఉపయుక్తమౌతుంది? ఇవేన్నీ ఇంకా యిట్లాంటి ఆధ్యాత్మిక సాధనోపయుక్తమైన విద్యార్థుల ప్రశ్నలకు సమాధానమిస్తు సినిమాల దుష్ట బోధనలకు లోనుగావద్దంటు, తీవ్రంగా హెచ్చరిస్తు మనస్సునందు దుష్పరిణామములు కలిగించే సాహిత్యంనుండి, పాశ్చాత్య సంస్కార

జనితమైన ''కలం స్నేహితుల''వంటి గ్రుడ్డివ్యవహారములనుండి దూరంగానుండమంటు, ప్రబోధించారు. ఆ క్యాంపులో పాల్గొన్న వారి ప్రతి యొక్కరి హృదయములోను భగవాన్ ప్రేమ పరి భ్రమిస్తుండేది.

జూన్ మొదటితేదీన బృందావనమును విడిచివెళ్ళేరోజు వచ్చినపుడు భగవాన్ యెంతగానో నచ్చచెప్పి ఒత్తిడిచేసిన తరు వాతగాని యే ఒక్కరూ శ్రీవారి సన్నిధివి విడిచి వెళ్ళటానికి యిష్టపడలేదు. వారంతా తీవ్రమైన అనుష్ఠానానికీ, భగవానుని గాఢముగా ప్రేమించటానికీ అలవాటుపడి యున్నారు. రాష్ట్ర ములవారీగా ప్రతియొక్క గ్రూపుతోనూ భగవాన్ కూర్చుని ఫొటోలు తీయించుకొనుటకు కృపతో ఆనందముగా అనుమతించిరి. నృష్టించిన బహుమతులతో వాళ్ళ హస్తములు నింపిరి. ఆడ పిల్లలకు ఒక చీర మగపిల్లలకు ప్రతివారికిని ఒక చొక్కా ఒక పంచె ప్రసాదించగా అవి ధరించి వారు మహాసభకు బారులు దీర్చి వచ్చుచుండగా మూర్తీభవించిన పవిత్ర భారత సంప్రదా యక సంస్కృతీ ప్రతినిధులుగా కనిపించారు.

వారు ఉద్బోధించిన అనుష్ఠానమును యేమరక శ్రద్ధగా ఆచరించమని హెచ్చరించి వారు యెక్కడున్నా తాను వారితో నుండి వారికి మార్గదర్శిగానుంటానని శ్రీవారు అభయమిచ్చారు

జూన్ రెండవ తేదీన బృందావనమునుండి యాబది మంది విద్యార్థులను శ్రీవారితో ప్రశాంతినిలయమునకు తీసికొని వచ్చి ఆ మరునాడు అక్కడినుండి అనంతపురం కాలేజీకి తీసి

కొని వెళ్ళిరి.

ఈ నెలరోజులనుంచి ఈ పవిత్ర సదస్సులలో పాల్గొనిన విద్యార్థులు దేశవ్యాప్తంగా కళాశాలలో ఈ మహత్తర ఆత్మవిద్యావ్యాప్తికి మార్గదర్శకులౌదురనుటకు యెంత మాత్రమూ సందేహములేదు.

[సం.]



# అశోక్ కుమారుని శపథము

భగవాన్ బాబావారి ఢిల్లీయాత్ర ఒక మరుపురాని మధుర ఘట్టము. శ్రీవారి దర్శనమాత్రముచేతనే మానవునిలోని అంతర్గత ఆధ్యాత్మికప్రవృత్తి జాగరితమవును. కాకులను కోకిలలుగను కొంగలను హంసలుగను మార్చగలది, ఆ దివ్యశక్తి.

అశోక్ కుమార్ ఢిల్లీలో ఒకస్కూటరు డ్రైవరు. వయసు సుమారు 20 సంవత్సరములు. సాధారణముగా తనబండియెక్కిన ప్రతి వ్యక్తిని మోసంచేసి పావలా పరకా ఎక్కువలాగటం బాగా

అతనికి అలవాటు. ఒక రోజున 'గోల్ఫ్‌లింక్స్' వద్దకు ఒక ప్రయాణీకుని తనబండిమీద తీసికొని వెళ్ళినాడు. అక్కడికి ఎవరో 'బాబా' వచ్చారు అని వినియున్నాడు. దర్శనముచేసు కుందామనే కుతూహలముతో అక్కడకాచుకొని రెండుమూడుసార్లు దర్శనముచేసుకోగలిగాడు. బాబాగారి ఫొటో ఒకటి పొందా అని వాంఛించినాడుకాని వీలుపడలేదు.

మరునాడు విధివశాత్తు నేను అతని స్కూటరులో 'గోల్ఫ్ లింక్స్' రోడ్డుమీద ప్రయాణముచేయుట తటస్థపడినది. స్కూటరు డ్రైవరు వెనుకకుతిరిగి "మీరు ఈ బాబాగారిని చూచినారా? అని ప్రశ్నించెను. అతను యేమి చెప్పుతాడో విందామని నేను ఎరుగనట్లు నటించుచు "ఎవరు ఆయన?" అని అడిగాను. వాడు అర్ధగంటసేపు బాబాగారినిగురించి, వారి మహిమలను గురించి, చెప్పిచెప్పి, తాను చాల అదృష్టవంతుడనని, ఆ మహానుభావుని దర్శనము తనకు ఒకసారికాదు రెండుసార్లు లభించినదని బాబా గారిని చూచిన తక్షణం, ఇక నేను ఎవరినీ మోసముచేయనని నామనస్సులో నిర్ణయము చేసుకున్నానని తెలిపినాడు. అతనిలో ఉబికివస్తున్న ఉత్సాహమునకు నేను ముగ్ధుడనైతిని.

ఇంటికి చేరిన తరువాత నేను అతనిని నా పూజామం దిరమునకు పిలుచుకొని వచ్చితిని. పుష్పమాలాలంకృతమైయున్న శ్రీ సత్యసాయిబాబాగారి చిత్రపటమును చూపితిని. ఆ గది అగరువత్తుల ధూపముతో గుప్పుమని గుబాళించుచున్నది. అతనికి ఒక ఫొటోను యిచ్చితిని. దానిని కృతజ్ఞతతో అందుకొంటు

బాబాగారు నా ప్రార్ధనను విన్నారని తెలిపెను.

మరునాడు అతని స్కూటరులో మరల ప్రయాణము చేసితిని. బాడుగ నాలుగురూపాయల నలుబదిపైసలు అయినది. నేను పది రూపాయల కాగితము యిచ్చి చిల్లర నీవు తీసుకో. నాకు యివ్వనక్కరలేదని అయిదు రూపాయలు మాత్రము తీసి కొంటిని. ఇంతలో మరొకవ్యక్తి ఆ స్కూటరు ఎక్కుటకు వచ్చెను. అశోక్‌కుమార్ సంభాషణలో మునిగి చేతిలోనిపదిరూపా యలనోటును జారవిడిచినాడు. అప్పుడే వచ్చిన ఆ మూడవ వ్యక్తి దానిని తస్కరించినాడు. అది మేము గమనించలేదు. నేను అక్కడనుండి వెడలిపోవుచుండగా స్కూటరు డ్రైవరు పరుగునవచ్చి "బాబుగారు: మీరు నాకు పదిరూపాయలనోటును యివ్వలేదు" అని అన్నాడు. నాకు ఆశ్చర్యమైనది. మరల యింకొక పది రూపాయల కాగితము యిచ్చి, నీ జేబులో ఎక్కడైనా ఆ పదిరూపాయలనోటు కనబడితే నాకు వాపసు యివ్వమని చెప్పినాను.

మరునటిరోజు అతడు మా యింటికివచ్చి ఆ నోటును తిరిగి యిచ్చినాడు. "బాబూ, నేను ఒక పెద్ద తప్పుచేసినాను. మీ తరువాత బండియెక్కిన పెద్దమనిషి మీ నోటును కాజేసి నాడు. నాకు అతను బాడుగ యిచ్చుచున్నప్పుడు నేను ఈ విషయము కనుగొన్నాను. సాధారణముగా నాకెవరయినానోటు యిస్తే దానిని నేను ఒక తరహాగా మడచటం అలవాటు. ఆ విధముగా మడచిన ఆ నోటును నేను ఆయన దగ్గర

చూచి దానిని నాకిచ్చివేయమని అడిగాను అతడు నిరాకరించినాడు. ఘర్షణ ప్రారంభమయినది, గుంపుచేరటము, పోలీసు రావటము జరిగినది, ఆయిష్టముగానే ఆ నోటును నాకిచ్చి ఆ పెద్దమనిషి వెడలిపోయినాడు. జనం అంతా వెళ్ళిన తరువాత పోలీసువాడు "ఈ నోటు స్వంతదారునకెందుకు యివ్వడం, మన మిద్దరం చెరిసగం తీసుకొందాము, నీవు అయిదురూపాయలు నేను అయిదురూపాయలు" అన్నాడు. "నాకు యేదయినా ఆపదవస్తే ఆదుకొనేది బాబాగారుకాని నీవుకాదు, ఆయనముందు నేను ఎవరినీ మోసముచేయననుకొని ఒట్టుపెట్టుకొనినాను, నాకు ఆపదాంబ్ధవుడు ఆయనకాని నీవుకాదు" అని చెప్పినాను.

బాబావారి దర్శన ప్రభావమునకు ఇది యొక చిన్న ఉదాహరణము మాత్రమే! వారి దర్శనభాగ్యము ఒక సాధారణ స్కూటరు డ్రైవరులో యింతమార్పు తేగలిగినది, ఇంక యెందరిలో ఎంతెంత మార్పులు వచ్చినవో, యెన్నెన్ని పరివర్తనలు, పశ్చాత్తాపములు కలిగినవో యెవరికెరుక !

మానవులలో మాత్రమేకాక ఢిల్లీ పట్టణ వాతావరణమే బాబావారి రాకతో పునీతమైనదని చెప్పటం అతిశయోక్తికాదు.

న్యూఢిల్లీ ఆర్. రామానుజం



# సమ్మర్ కోర్సు

భారతీయ సంస్కృతియందు వెలుగుచున్న ఆత్మతత్త్వ మును మరచి, త్యాగము, సౌశీల్యము మొదలైన పవిత్రగుణ ములను మరుగుపరచి, వైదిక సామాజిక రాష్ట్రీయ సమస్యలను అయోమయమొనర్చి ఆధునిక శిక్షణాపద్ధతులు దేశవాతావరణమునే చెరిపినవి. విద్యార్థులు బహుభాషా విదగ్ధులుకావటము అంత ముఖ్యముకాదు; వాళ్ళ మస్తకములను పుస్తకములుగా మార్చితే లాభములేదు; వాళ్ళలో సచ్ఛీలము, సభ్యత. వినయము, సేవా సక్తి. భ్రాతృభావము. సహనము వీటిని అభివృద్ధి పరచవలెను. మనకుకావలసినది Information ఒక్కటేకాదు; దానితోపాటు Transformation కూడ రావలెను.

లక్ష్యశుద్ధికి తగిన భావశుద్ధి అతి ప్రధానము. డిగ్రీలను పొందటముకాదు ముఖ్యము; విద్యార్థిజీవితములో నీతి, నిజాయితీ, పెద్దలంటె గౌరవము. దేశమాత, దేహమాత వీటిపై భక్తి విశ్వాసములుకలిగి వీటిని పోషించుకోవలెను.

పాశ్చాత్యనాగరికతయొక్క ప్రభావమువలన విచిత్రరీతిగా భారతీయ విద్యారులలో వికారభావములు బయలుదేరు చున్నవి. తాత్కాలిక విషయానందములకొరకై విఱ్ఱవీగి, భారతీయసంస్కృతి లోని అమూల్య రత్నములను పోగొట్టుకొనుచున్నారు యువక వయస్సు ఒక దివ్యమైన జీవిత ఘట్టము: జీవితమును సార్థ కపరచే ఆత్మసాక్షాత్కారమునకు అగత్యమైన సాధనలకు, ఇపుడే

పునాది వేసికోవలెను. ఈ సమయమును వ్యర్థముగావించిన జీవితమందు వ్యథ పడవలసివచ్చును.

తల్లిదండ్రులే ఈ విషాద పరిస్థితులకు మూలకారణము. అంతేగాక విద్యావిషయమై పరిశీలించి శిక్షణాపద్ధతులను వ్యవస్థచేసే అధికారులు, పెద్దలు వీరున్నూ జవాబుదారులే!

The End of Wisdom is Freedom
The End of Civilisation is Perfection
The End of Knowledge is Love
The End of Education is Character

మోక్షమే జ్ఞానముయొక్క గురి; పరిపూర్ణతయే నాగరికతయొక్క గురి; సర్వజన సమాన ప్రేమయే విద్యయొక్కగురి; సచ్ఛీలమే శిక్షణాపద్ధతుల గురి; ఈ ఆదర్శములను పురస్కరించుకొని, విద్యార్థులలో క్రమశిక్షణ, వినయ విధేయతలు, సహన భావము వీటిని అభివృద్ధిపరచి, వారికి మన భారతీయ సంస్కృతి మరియు ఆధ్యాత్మిక విద్య వీటిపై శ్రద్ధా భక్తులను అంకురింపచేసి వారి విజ్ఞాన సుజ్ఞాన ప్రజ్ఞానములను వికసింపచేసే కొరకు ఈ సమ్మర్ కోర్సును ఏర్పాటు చేసినాము.

తల్లిదండ్రులు సమాజములోని పెద్దలు విద్యాబోధకులు దేశీయనాయకులు తమతమ బాధ్యతలను గుర్తించుకొని వర్తమాన కాలమునకు భవిష్యత్తునకు మధ్య వంతెనవలెనున్న ఈ శిక్షణా పద్ధతిని సుభద్రము చేయుటకు పూనుకోవలెను. విద్యార్జనవలన లౌకికదృష్టి, లౌకికవాంఛలు మాత్రమే అభివృద్ధి అయినచో జీవి

తమునకు ప్రశాంతియేర్పడదు. కేవలము తాత్కాలిక సంతృప్తి సౌందర్యము. ఆనందము వీటికే ఘనతనీయకూడదు. మాతా పితల చిత్తమును సంతృప్తిపరచినపుడే ఆర్జించిన విద్యకు విలువ. పాపభీతి, దైవప్రీతి పెద్దలపై గౌరవము విశ్వాసము వీటిని కూడ అభివృద్ధి పరచవలెను. తనను తాను విచారణచేసి తెలిసికొనక. శాంతి దొరకదు. చుక్కల లెక్కించిలను, చంద్రునిపై దిగినను శాంతి చేకూరదు. అహంకారము, అసూయ, స్వార్థము పెరుగును. అంతే.

భారత భవిష్యత్తును తీర్చిదిద్దగల శక్తిసామర్థ్యములుగలిగిన విద్యార్థులారా! ఈ సమ్మర్‌కోర్సులో ఆర్ష సంస్కృతియొక్క మూలతత్త్వములు. భారతీయ దర్శనములు, గీతాప్రబోధములు. ఇతిహాసపురాణములోని దివ్యోపదేశములు, సర్వ మత సామరస్యము. విజ్ఞాన ప్రపంచముయొక్క స్థితిగతులు, వేదప్రమాణమైన కర్మ ధర్మములు వీటన్నింటిని అనుభవనీయులైన విద్వాంసులు మీకు ఈ నెలరోజులూ అందింతురు. యావద్భారత దేశమందలి వివిధప్రాంతములనుండి, వివిధ బాషలభాషించుచు వివిధాహారముల గ్రోలుచు సంచరించువారు మీరు. మీకు కొన్ని అనుకూలములు యిచ్చట లేకపోయినను, నిరుత్సాహపడక వాటిని భరించుకొని. ఆ కించిత్ కష్టములకోర్చుకొని మీకు అనుభవజ్ఞులు అందించే జ్ఞానమును ఆనందముగా అందుకోండి.

శరీరపుష్టికి వ్యాయామము ఎంత అవసరమో. మానసిక సంతుష్టికి అనానుకూలములను సహించుట అంతటి అత్యవసరము.

కాలమును వ్యర్థముచేయక, సత్సంగము సత్‌చింతన సద్విషయ ముల శ్రవణ మననములతో గడుపండి. ఇవి మీకు Holi-days కావు; Holy Days! పండుగదినములను పంచభక్ష్య పరమాన్నములను భుజించేకొరకు వినియోగించకూడదు. పర మాత్మ తత్త్వమును తెలిసికొనే ప్రయత్నమునకు వినియోగించు కొనవలయును.

బృందావనము శ్రీవారి దివ్యోపన్యాసమునుంచి
1-5-72

## చతుస్సూత్రములు

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు తమ దివ్యోపన్యాస ములలో సత్య ధర్మ శాంతి ప్రేమలను అభివృద్ధి చేసికొమ్మని మానవకోటికి ఉపదేశించుతురుకదా? మన కర్మలను ఫలాసక్తిలేక చక్కగా కుశలమతితో శ్రద్ధగా నిర్వర్తించిన. అదే ధర్మము; అదే కర్మ మార్గముయొక్క అనుసరణ. మనసులోని వివిధ భావోద్రేకములను భగవంతునిపై మరల్చి, అందరియందు విరాజ మానుడుగా వెలసియున్న అతనియందు భక్తి నుంచుట — అదే ప్రేమ; భక్తిమార్గముయొక్క అనుసరణ. ధ్యానములో ఏకా గ్రతను సంపాదించి చిత్త వృత్తులను నిరోధించినచో లభించేదే శాంతి. ఇదే యోగమార్గముయొక్క అనుసరణ. ఫలితము. ఈ మార్గమును అనుసరించి పొందే చిత్తశుద్ధితో జ్ఞానోదయము కలిగి తెలిసికొనేదే సత్యము. జ్ఞానమార్గముయొక్క ఫలితమిదే. కాబట్టి శ్రీవారు కర్మమార్గము. భక్తిమార్గము. యోగమార్గము జ్ఞానమార్గము సమన్వయముచేసి తమ దివ్య సందేశమును లోకు లకందించుచున్నారనేది గమనార్హమైన విషయము.

(టి. ఎం. పి. మహాదేవన్‌గారిఉపన్యాసమునుంచి)

# లోకఘోష

* * *

సకలాత్మవగు నీకు వికలాత్ములము మేము
విన్నవించుట వట్టి వెఱ్ఱితనము
అనుభవింపగరాని దనరానిదైనదీ
లోకము శోకడ లోని బాధ
లోకమీశ్వరమయం బౌకతంబున, నందు
దప్పు మోపుటకు నీవొప్పుకొనవు
కలి పాపయుగమని, కాలంబునందుమా,
యది నా స్వరూపంబె యందు వీవు
మానవుల్ పరమ దుర్మార్గులైనారన్న,
నమృత పుత్రుండాతఁడందు వీవు
మనసులు చెడెనన్న, మా తెల్వితక్కువే
యందులకున్ హేతువందు వీవు
మా తెల్విలేమికి హేతువేమొనాకో.
నీ మాయగాదొకో నిక్కమరయ
ఆ మీదవిఁక చర్చయక్కఱలేదయ్య.
యది యబోధంబు బ్రహ్మాదులకును.
కారణం బేదియో కానరాదేగాని.
కార్యమో బాధ లవార్యమయ్యె

నోరున్నవారెన్ని ఘోరాలుచేయనీ,
యాకత్తి కడ్డమే లేకపోయె
ధర్మమన్ బురఖాను ధరియించి స్వేచ్ఛగా
బరమనైచ్యమువకుఁ బాలువడిరి
ప్రత్యక్షరాక్షసకృత్యముల్ బహుధర్మ
మని చెలామణియయ్యెనయ్య నేఁడు
వలదన్న కొలఁదియుఁ జెలరేగుచున్నది
మా కహంకారంబు మట్టుమీఱి
యే లోకమందొ మా కింద్రియ నిగ్రహం
బమితమయ్యె దురాశ యాత్మలందు
పదవి, పైదలి, పైస, యొదవినంతనె, తిక్క-
తలకెక్కు, నేమి చిత్రంబొ సామి!
నల్లేరుపై బండినడక గాఁదగు మంచి,
పల్లేర్లపైఁ గాలిబాటయయ్యె
వచ్చిన నన్యాయి మెచ్చగింపనివారు
జీవితాంతము మాడి చావవలసె
భావిజన్మసుఖంబె భావించుకొని నేడు
నిశ్చింతగా నుండ నేరరైరి
కడుపుమంటయు, వృథాకంఠశోషయెగావి,
యిది తీరదన్న నిస్పృహజనించె
వినుఁజూచుకొని యాశ, వినుఁజూచుకొని ధైర్య,
మీ మాత్రమైన మా కిపుడుగల్గెఁ,

గంటికి దైవంబు కవ్వించె, మాకింక
గాలిలో మొఱపెట్టు జాలిలేదు
కలియందు సాధులౌ కాందిశీకులమొఱల్
గావె యీ యవతారకారణంబు
దీనసాధుత్రాణదీక్షతో నేకదా
యవతరించితివి నీవవనియందుఁ
గపులచే సేతువు గట్టించినావంట,
గొల్లలతో నాడుకొంటివంట,
యల పురాణాలఁలో గల నీ మహత్త్వంబు
నేడు నిరూపించి నిల్పు తండ్రి:
కలియందుఁ బూర్తిగాఁ దలక్రిందులై యున్న
ధర్మముగా నిల్పసాధ్యంబు నీకె
సత్యధర్మప్రేమశాంతిస్వరూపమౌ
నీదివ్యకళలిలన్ నిలుపు తండ్రి:
యే కొందఱో యిట్లు వాకొందురనఁబోకు,
మిది లోకఘోష. సాయీశ! వినవె

దిక్కుదోచని గజిబిజిగా జిక్కె జగతి:
దిక్కు నీ వొక్కడేఁయంచు దీనులెల్లఁ
జేయు ప్రార్థన విజ్ఞప్తి సేసినాడ,
నింక నీ దయ, సత్యసాయీశ! దేవ! ॥

రామశర్మ

# పుస్తక సూచి

1 పుస్తకముల వెలయూ పోస్టు మరియు రిజిస్ట్రేషను ఛార్జీలయూ మని యార్డరుద్వారా మాకు పంపించిన తరువాత మాత్రమే మీకు పుస్తకములు పంపించగలము.

2 విలువలోనున్న పుస్తకములు వాటి పోస్టు ఛార్జీలు క్రింద తెలియ జేయబడినవి. పుస్తకములు రిజిష్టర్డు బుక్‌పోస్టులో మాత్రమే పంపబడును. మీకు కావలసినపుస్తకముల వెలయూ పోస్టుచార్జీ మరియు, ప్రతి ఆర్డరుతోనూ రిజిస్ట్రేషను ఛార్జీ రూ. 1-05పై జతపరచి, కావలసిన పుస్తకములను వివరముగా వ్రాసి పంపవలెను.

| | పేరు | వెల | టపాలచార్జీ |
|---|---|---|---|
| తెలుగు: | | | |
| 1. | సత్యంశివం సుందరం(1) | 4-00 | 0-40 |
| 2. | .. .. (2) | 4-00 | 0-45 |
| 3. | మణిమాల | 1-00 | 0-15 |
| 4. | భాగవత వాహిని | 4-00 | 0-25 |
| 5. | అర్పణ | 1-00 | 0-10 |
| 6. | సాయిరామ నామమహిమ | 1-00 | 0-10 |
| 7. | సందేహ నివారిణి | 1-50 | 0-20 |
| | గీతా వాహిని | 4-00 | 0-40 |
| | వచనామృతము | 4-00 | 0-30 |
| 10. | ధర్మ వాహిని | 1-50 | 0-15 |
| 11. | సాయిరాముడెవరు | 1-00 | 0-10 |
| 12. | బోధామృతము | 0-50 | 0-10 |
| 13. | సాయిమహిమ | 1-00 | 0-20 |

| | | | |
|---|---|---|---|
| 14. | భజనావళి | 1-00 | 0-20 |
| 15. | దివ్యోపన్యాసములు | 1-50 | 0-15 |
| 16. | స్తుతి తరంగిణి (2వ భా) | 0-50 | 0-10 |

కన్నడం:——

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యం శివం సుందరం | 3-50 | 0-30 |
| 2. | జ్ఞాన వాహిని | 1-50 | 0-10 |
| 3. | ప్రశాంతి వాహిని | 1-50 | 0-10 |
| 4. | సందేహ నివారిణి | 1-50 | 0-10 |
| 5. | ధర్మ వాహిని | 1-50 | 0-10 |
| 6. | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 7. | ధ్యాన వాహిని | 1-50 | 0-10 |
| 8. | ప్రశ్నోత్తర వాహిని | 1-00 | 0-15 |
| 9. | గీతావాహిని | 4-00 | 0-25 |

మలయాళము:——

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యం శివం సుందరం (2) | 4-00 | 0-40 |
| 2. | 108 రత్నంగళ్ | 1-50 | 0-10 |
| 3. | గీతావాహిని | 3-00 | 0-15 |
| 4. | వచోరత్నంగళ్ (1) | 2-00 | 0-20 |
| 5. | ధ్యానవాహిని | 1-50 | 0-15 |
| 6. | అవతార మధురవాక్య | 2-00 | 0-20 |
| 7. | డివైన్ వాల్కటు ది స్టూడెంట్సు | 1-00 | 0-15 |
| 8. | ధర్మ వాహిని | 1-00 | 0-10 |
| 9. | జ్ఞానోపదేశ రత్నాంగళ్ | 1-50 | 0-25 |

ఇంగ్లీషు:——

| | | |
|---|---|---|
| 1. సత్యసాయి స్పీక్స్ (1భా) | 4-00 | 0-25 |

| | | | |
|---|---|---|---|
| 2. | సత్యసాయి స్పీక్స్ (2భా) | 4-00 | 0 30 |
| 3. | .. .. (3భా) | 4-00 | 0-30 |
| 4. | ,, .. (4భా) | 5-00 | 0-40 |
| 5. | .. .. (5భా) | 5-00 | 0-40 |
| | .. .. (6భా) | 5-00 | 0-40 |
| 7. | (7భా) | 7-00 | 0-65 |
| 8. | సెలక్టెడ్ 'ృయల్స్ (పద్యములు) | 1-50 | 0-10 |
| | సాయిబాబా [అమెరికన్ ఎడిషన్ సత్యం శివం సుందరం (1)] | 6-00 | 0-40 |
| 10. | ప్రశాంతి వాహిని | 2-00 | 0-15 |
| 11. | ప్రేమ వాహిని | 2-00 | 0-15 |
| 12. | ఉపనిషత్ వాహిని | 2-00 | 0-15 |
| 13. | సందేహ నివారిణి | 2-00 | 0-20 |
| 14. | గీతా వాహిని | 4-00 | 0-35 |
| 15. | జ్ఞాన వాహిని | 2-00 | 0-15 |
| 16. | భాగవతవాహిని | 5-00 | 0-40 |
| 17. | భజన్‌సాంగ్స్ | 2-00 | 0-20 |

అరవం:——

| | | | |
|---|---|---|---|
| 1. | భగవాన్ శ్రీ సత్యసాయిబాబా అరుళ్‌వాక్కు | 2-00 | 0-15 |
| 2. | అన్‌బిన్ జ్యోతి | 2-00 | 0-20 |
| 3. | సత్యం శివం సుందరం (1వ బా) | 3-50 | 0-40 |
| 4. | (2వ బా) | 4-00 | 0-30 |
| 5. | భజనావళి | 1-00 | 0-15 |
| | అవతారమొళిఅముదం (1వ భా) | 3-00 | 0-30 |
| 7. | ,, ,, (2వ భా) | 3-00 | 0-35 |
| 8. | సాయిమాత | 1-00 | 0-10 |

| | | | |
|---|---|---|---|
| 9. | ధర్మ వాహిని | 1-50 | 0-15 |
| 10. | సందేహనివారిణి | 2-00 | 0-25 |

హిందీ:——

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యసాయీశ్వరాయనమః (పద్యములు) | 1-00 | 0-10 |

బెంగాలి:——

| | | | |
|---|---|---|---|
| 1. | ధ్యానవాహిని | 1-75 | 0-10 |

గుజరాతీ:——

| | | | |
|---|---|---|---|
| 1. | అమృత్ వాహిని | 2-00 | 0-20 |
| 2. | కథాసుధ | 2-00 | 0-15 |

సింధి:—

| | | | |
|---|---|---|---|
| 1. | భజనావళి | 0-50 | 0-10 |
| 2. | ధ్యానవాహిని | 1-00 | 0-15 |
| 3. | ప్రశాంతివాహిని | 1-50 | 0-10 |
| 4. | సత్యం శివం సుందరం (1వ భా) | 4-00 | 0.40 |
| 5. | .. .. (2వ భా) | 4-00 | 0-40 |

మేనేజర్, సనాతన సారథి

